# SUSEELA.

## A TALE FOR GIRLS.

RAJA M. BHUJANGARAU,

BAHADUR ZAMINDAR,

ELLORE.

2ND EDITION.

THE MANJUVANI PRESS, ELLORE.

 *Price 4 A*

SREE

# Simhadrinarasimha

# Satakam.





BY

*Gokulapati Koorma Kavi.*



THE MANJUVANI PRESS, ELLORE.

1906.




*[Price 4 Annas.*

శ్రీరస్తు.

# సింహాద్రి నారసింహ శతకము.



ఇది

శ్రీ విష్ణుభక్తాగ్రేసరుం డగు

గోకులపాటి కూర్మకవిచే

రచియింపఁబడి

లేఖప్రమాదజనితాశుద్ధయతిగణప్రాసదోషరాహిత్యంబుగఁ

బరిష్కరింపఁబడియె.




మంజువాణీముద్రాక్షరశాల,

ఏలూరు.





1906.

వెల 4 అణాలు.

శ్రీరస్తు.

# సింహాద్రి నారసింహ శతకము.



సీ. శ్రీమద్రమా రమణీమణీ రమణీ[illegible]
సగసచిత్తాబ్జ బంధురపరాకు
శంఖచక్రగదాసి శార్ఙ్గచాపాదిభా
సురదివ్య సాధనకర పరాకు
ప్రహలాద నారదవ్యాసశుకాదిక
భక్తసంరక్షణ వరపరాకు
బహుతర బ్రహ్మాండ భాండపరంపరా
భరణ లీలాధురంధరపరాకు

గీ. నీకుసాష్టాంగ వినతులనేక గతులఁ
జేసివిన్నప మొనరింతుఁ జిత్తగింపు
చనటినీఁడని మదిలోనఁ గినుకమాను
వైరి హరరంహ సింహాద్రినారసింహ.

సీ. అవధారుదేవ చిత్తావధానతగాను
వనజజాసులుసేయు వందనములు
చెలఁగ రాత్రిందివ స్థితిగతుల్దెలుపఁగా
సోమపద్మాప్తు లిచ్చోనిలిచిరి
మందారతరుసూన మాల్యముల్గొనియింద్రుఁ
డేతెంచె నిందుల క్షేమియాజ్ఞ

గంధర్వకిన్నరు ల్కరగతవీణులై
తడవాయె వచ్చిరి దర్శనేచ్ఛ

గీ. ననుచు జయవిజయులుదెల్ప హాయనుచును
నిందఱను గూడియుంటివి యింటికన్న
గుడిపదిలమంచు యవనులఁ గొట్టుమయ్య. వై 2

సీ. చటుల సోమకహరస్ఫుటతరాటోపంబు
కుంభినీభరణ విజృంభణంబు
ఖలహిరణ్యాక్ష శిక్షాదూపదక్షత
యుగ్రమహా నృహరిమూర్త్యుద్గతంబు
బలిమహా వైభవభంజిక మహిమంబు
సర్వధరాధిపశమనరీతి
యతిదుష్టదశకంఠ హరణబాహాశక్తి
ప్రబలప్రలంబ దారణవిక్రమంబు

గీ. పురవధూ వ్రతభంగ విస్ఫురణసరణి
భువనములఁ బ్రోవఁగావించి జవనయవన
సేనవణచుటకిటు జాగు సేయఁదగునె. వై 3

సీ. చుట్టబెట్టిరి మహారట్టజంబులతోడ
నిఖిలరాజ్యము పఠాణీలపౌజు
మట్టిమల్లాడిరి మదసామజంబుల
జనపదంబులు తురుష్కప్రబలము
గొట్టికొల్లలు గొనెగురువిప్రమానినీ
ఘనగోగణంబుల ఖానుసమితి
పట్టిపల్లార్చిరి బహుదుర్గవర్గముల్

సరభసోద్ధత్యపాశ్చాత్యయంబు

గీ. మించిభూస్థలి నిటులాక్ష మించిరాగ
నలుపరాదేమి నగరివారలనువంచి
పొంచియుంటివియవనులంద్రుంచుమికను. నై 4

సీ. మొరవోయెనోవక్రముఖనక్రహరమహా
సంపర్కనిర్వక్ర చక్రధార
వాసిదప్పెనొ పాణిబాసిసుమాలిను
హాసురశార్ఙ్గ బాణాసనంబు
పదునువోయెనొ మధుప్రముఖేంద్రహరరిపు
బృందారకా నందనందకంబు
కడిమిదప్పెనొ సౌంభకమక ప్రథవిధాన
చండమై తగుగదాదండపటిమ

గీ. జబ్బు పడియుంటివేమి మాయబ్బయొక్క
దెబ్బదీయక తురకల యుబ్బుచెడదు
గుబ్బునచెలంగు మీకనైన నిబ్బరముగ. నై 5

సీ. మొగసిరక్కసిబొండుం దగిలించునీగోళ్ళు
చిటిలెనోసిరిగుచ శిఖరిదాకి
యరులపై భగభగలాడు కోపజ్వాల
లారెనో శ్రీకటా క్షామృతమున
బరవీరగర్భము ల్పగిలించునీబొబ్బ
తిలంగెనో మానందగద్గదికను
ఖలులధట్టించంగా కతినహానీగుండె

కరగనో శ్రీలక్ష్మి సరసకేళి

గీ. సమహానీభీకరోద్వృత్తి యబ్బురముగ
యవనరాజులనణంచి వేయంగవలయుఁ
జిన్న పామున కైనను బెద్దదెబ్బ. వై 6

సీ. పొదలలో డాగెనో పొట్నూరిలోనున్న
రమణీయ కోదండ రామమూర్తి
యెక్కడఁ డాగెనో యెఱుఁగఁగరాదుగా
పటుభీమసింగి గోపాలమూర్తి
సాధ్వసవృత్తి నెచ్చటికేగియుండెనో
జామిజనార్దన స్వామిమూర్తి
యెన్ని పాట్లనుబడి యున్నాఁడొ చోడవ
రంబులో కేశవరాయమూర్తి

గీ. నిబిడయవనుల భయశంక నీవునింకఁ
బరులకగపడకుండుము ప్రక్కనున్న
గాయమిప్పటికిని మానదాయెనయ్య. వై 7

సీ. పాశ్చాత్యులసమాజాకై బుద్ధిపుట్టెనో
మౌనులజపముకై మనసుగోసి
యవనుల కందూరియందిచ్చ గల్గెనో
విప్రయజ్ఞములకై విసుపుబుట్టి
ఖానుజాతి సలాముకై యింపుబుట్టెనో
దేవతాప్రణుతికై భావమెడలి
తురకలయందు సంతోషంబుగల్గెనో

భక్తినిత్యోత్సవ పరతమాని

గీ. వాండ్రుదుర్మార్గులయ్యెనో వ్రతముచెడ్డ
సుఖముదక్కదు వడిఢిల్లి పారఁదోలు
పారసీకాధిపుల పటాపంచలుగను. వై 8

సీ. నీకొండపై నెక్కి నిఖిలసద్భక్తులఁ
గొట్టినా [illegible] [illegible]ట్టకుండ
గంగధారాతీత కలితమంటపముల
మద్యపానముజేసి మలయకుండ
నీవంటసాలలో నిశ్శంకతో మాంస
ఖండము ల్రెండుగా వండకుండ
నీగుడిఁ జొచ్చి దుర్నీతిఁ గామాంధులై
పరవధూటుల భంగపరుపకుండఁ

గీ. పౌరుషంబునఁ దురకలఁ బాఱఁదరుము
వేటకాడిల మెత్తనాచోట లేడి
మూఁడుకాళ్ళను నడచు నిర్మూలితాంహ. వై 9

సీ. సెలవైనభైరవుం డలుకతో వైరుల
నత్తి తానరచేత మొత్తలేడె
యాజ్ఞయిచ్చిన వీరహనుమంతుఁ డహితుల
ఘనవాలమున నేలఁ గలుపలేడె
అంపించితే మదనాంతకుం డతివేగ
శూలమ్మునను గ్రుమ్మి జొదుపలేడె
కనుసన్నఁ జేసిన వినతాతనూజుండు

విమలత నేఁగిపో విసరలేడ

గీ. ఇంతతాలిమిఁ జేతురే యిప్పటికిని
మట్టికొనివచ్చె శత్రుసమాజమెల్లఁ
బ్రజలరక్షించు యవనుల బలముఁగూల్చి. వై 10

సీ. యవనేశు ధాటికి నరసి సర్వస్వమ్ము
విడిచి మందిరములు వెడలువారు
వెడలియుఁ దలఁదాచ నెరవేమిగానక
యడవుల నిడుమల నందు వారు
నంది డెందముగుంది గాందిసీకతనభి
మానార్థులై బెంగఁబడెడివారుఁ
బడియు నెచ్చటఁ గూడు బట్టగానక తమ
శిశువులతో వెతఁజెందువారు

గీ. వైరి యొక్కొక్క భార్యతో నవనిఁ బ్రజలు
అష్టమహిషులతోఁ బదహారువేల
యతివలతో వలసియెచ్చటి కరిగదయ్య. వై 11

సీ. దర్పణాకృతిఁ దళత్తళలాడు కంబాల
డంబై చెలంగు బడాహొరంగు
చెప్పఁ జూడఁగ రాని యొప్పైన నుప్పరం
బప్పళించెడు వంకకొప్పుచొప్పు
చిత్రవిచిత్రమా చిత్రంపు బొమ్మల
గుల్కు చక్కనిగుబ్బ గోపురములు
అమృతోపమానమై నట్టియాగంగధా

రాముఖ్య సకలధారాజలంబు

గీ. ఎంతముచ్చటపై సృజియించినావొ
యిల్లు చెడఁగొట్టుకొనకు నన్నేలినయ్య
ఘనతురుష్కులఁ జెడఁగొట్టు పనసుపట్టి. వై 12

సీ. యవనధాటికి భయ మందియే కాఁబోలు
నక్కజంబుగఁ గొండ నెక్కినావు
ఖానుల కడలియే కాఁబోలు నయపూర్ణ
పౌరుషంబునఁ గత్తిఁ బట్టవైతి
వఖిల పాశ్చాత్యుల కడలియేకాఁబోలుఁ
దాపసిగతి జడదాల్చినావు
భీమపఠాణీల భీతియె కాఁబోలు
జోగిచందంబున డాగినావు

గీ ఆర్తజనముల నాపల్కు లాలకించి
ప్రోవకున్నను దగునయ్య దేవరేణ్య
కులువలైనట్టి బలుతురుష్కులవధించు. వై 13

సీ. పటుతర స్తంభంబు పటపటబ్రద్దలు
గాఁజనించిన నీయఖండమహిమ
చటులతరంబుగాఁ బెటపెట దంష్ట్రిలు
గొఱుకుచువచ్చు నీఘోరవృత్తి
స్ఫుటతరోద్భటవృత్తి చిటచిటధ్వనిమీఱు
నీనిటలాక్ష వహ్నిప్రభాళి
కుటిలనఖంబుల బొటబొటనెత్తురు

జెంద రక్కసిరొమ్ముఁ జెందుకణక

గీ. యెందువోయెను నేడుమహీజనంబు
గుంద నౌద్ధత్యమునవచ్చు ఘోరయవన
బృందములయందుఁజూపు తద్భీతిగతులు. సిం 14

సీ. నట్టువర్దొక్కను నల యమునాభూస్థ
లంబుగాదు రణస్థలంబుగాని
కొట్టితోలంగను గోవృషంబులుగావు
పరతెంచు గుర్రాల పౌజుగాని
పట్టిచూడఁగనీకుఁ బసిగాపుచెలుల పా
లిండ్లుగావు ఫిరంగి గుండ్లుగాని
ముట్టి ముక్కలుసేయ మురిసిన యర్జున
తరులుగావివి వరతరులుగాని

గీ. యవన బలములతోడఁ బోట్లాడలేవు
క్రూరుఁడైన జరాసంధ శూరుననుచు
నాటి యుపమేది నీకును నవ్వుగాదు. సిం 15

సీ. కాంతలఁ జెఱబట్టఁ గనుఁగొనుచుంటివి
పాంచాలి వెతలెట్లుబాపినావు
గోవధ గాఁగఁ గన్గొనుచునుంటివిగాని
కరుణతోఁ గరినెట్లు గాచినావు
ద్విజులబాధలు పడఁ దిలకించుచుంటివి
భువిఁ గుచేలుని నెట్లు బ్రోచినావు
సత్ప్రభులెల్ల నాశన మొందఁ గంటివి

ధ్రువుని కెట్లిచ్చితి దొడ్డపదవి

గీ. దుష్టశిక్షణ మొనరించు శిష్టరక్ష
సేయకుండినఁ బూర్వప్రసిద్ధి చెడును
ఆర్తరక్షణ బిరుదుకు హానివచ్చు వై 16

సీ. సముద్రగమగు సముద్రముఁజొచ్చి యీదుటో
కొండ నెత్తిన్ఁ బెట్టుకొంటయొక్కొ
ధారుణీస్థలిఁ ద్రవ్వి తలకెత్తుకొంటయో
గొబ్బున సింగంపు బొబ్బయిడుటొ
అడుగిడి త్రైలోక్య మాక్రమించుటయొక్కొ
వేయిచేతులవాని వ్రేయుటొక్కొ
ఒకశరాగ్రంబున నుదధి యింకించుటో
కరిపురంబెల్లఁ జెకల్చుటొక్కొ

గీ: కరుణ జగములఁ బ్రోచుటో తురగ మెక్కి
ఘనరిపులఁ గొట్టుటో తురుష్కవధయెంత
కొండయెక్కుదు బ్రతిమాలుకొద్దినీవు వై 17

సీ. కురుబాలు ప్రొద్దునఁ గ్రోలక యొక క్షణ
మైనఁ దాళవుగదా యాకటికిని
బాగుగా మెయి మలాకీగంధములదక
యింపు పుట్టదుగదా యెప్పటికినిఁ
దనువున ధగధగద్ధగిత పటాంబర
మును ధరింపకమాన వనవరతము
ఆటపాటలు మొదలగు వినోదంబుల

నుబుసుపుచ్చక గాని యుండలేవు

గీ. భక్తులెల్లనుదుర్మార్గ పరతరుష్క-
రాజుచే నొందిరిలఁ దీర్పరానిపాట్లు
భోగరాగంబు లిఁకనీకుఁ బొందు టెట్లు వై 18

సీ. పుట్టినప్పుడె జోకఁ బోకార్చితివిపూత
పూతనాఖ్యోపేత యాతుధానఁ
బుడమిపైఁ గడుఁ దప్పటడుగులిడిననాడె
బండిరక్కసి మేనుఁ జెండినావు
ఆటప్రాయమున బకోట వత్సక ధేను
కాది దైత్యకులంబు నణచినావు
యవ్వనంబున నృశంసావతంసక కంస
విధ్వంసనంబున వెలసినావు

గీ. భూసురులఁ బ్రోవఁ దురకల నాసుమాలి
యిప్పుడేటికిఁ ద్రుంప వేళ్ళైగసైన
బుద్ధి దిగసనవచ్చుఁ గాఁబోలు నేమి. వై 19

సీ. అలవిరే సోమయాజుల పెద్దజారీలు
గుడుగుడీలుగఁ జేసికొనెడివారు
యజ్ఞవాటికలలో నగ్నిహోత్రంబుల
ధూమపానముఁ జేసి త్రుళ్ళువారు
యాగపాత్రలు దెచ్చి హాసుగా వడినేలఁ
గుప్పలుగాఁ జేసికొనెడివారు
స్రుక్స్రువముఖ్య దారుప్రకరంబులు

గొని వంటఁబ్రాయి నిడుకొనెడివారు

గీ. నగుచు యవనులు విప్రులఁ దెగడుచుండ
సవనభోక్తవు నీకిటుసలుపఁ దగునె
తినఁగఁదిన గారెలైనను గసరువేయు వై 20

సీ. చింకి కుళ్ళాయైన శిరమునఁ దాలిచి
దివ్యకిరీటంబుఁ దీసిపోచు
వనమాలయేచాలు వక్షంబు ధరియింపఁ
గౌస్తుభరత్నంబు గట్టిసేయు
పూడకుండఁగఁ జెవిఁ బుడకైన నిడుకొని
మకరకుండలములు మాటుసేయు
కటిధగద్ధగితమౌ కనకచేలంబేల
మొలఁ జుట్టు మొకపాటి ముతకబట్ట

గీ. దొడ్డసరకులు తురకలు దోచుకొనినఁ
గష్టమౌఁ గానివేళ జగత్కుటుంబి
నీదువేషంబు చెడనెట్లు నీకుఁగలుగు. వై 21

సీ. నామొరాలించవు నారదగానంబు
వినుచుంటివో వేడ్క వీనులలరఁ
గరుణఁజూడవుమమ్ముఁ గమలామహాదేవి
కన్నులు మూసెనో కౌతుకమున
మముఁ బ్రోవరావేమి కమలభవాదులు
భక్తితోఁ బాదము ల్బట్టుకొనిరొ
ఆదరకలన మాటాడవు భూనీల

లలరఁగ ముచ్చట లాడుచుండ్రొ

గీ. యిట్టులున్న ననాథల కేమిదిక్కు
సమయమాయిది కేళికాసౌఖ్యమునకు
దుష్టుల వధించి ప్రోవు సాధువులనెల్ల. వై 22

సీ. పాలీయవచ్చిన భామినీప్రాణంబు
నపహరించి చరించునట్లుగాదు
యాగోత్సవంబున కలిమోదమునఁ బిల్వ
నంపి మామను ద్రుంచినట్లుగాదు
చేతగాకను నరు చేతను జుట్టంబు
లందఱిఁ జంపించినట్లుగాదు
తుంగఁ గల్పించి యుత్తుంగ వంశద్రోహ
మాచరించి చెలంగినట్లుగాదు

గీ. పరబలంబిది నీప్రజ్ఞ పనికిరాదు
లెమ్మికను మీనమేషము లెక్కయిడక
జాణుకు తురకలఁ గొట్టఁగాఁ జొక్కయెదుట. వై 23

సీ. అవని మూఁడడుగు లిమ్మని పోయివచ్చిన
బలి నణంచినదేమి ప్రాభవంబు
ఇనకుమారుని మది కిచ్చకంబునఁ బొంచి
వాలినిఁ జంపు టేటీలునీకు
యవనభీకరవృత్తి కడలియామునికుందు
పాలి కేతెంచు టేపౌరుషంబు
భువి జరాసంధుతోఁ బోరాడఁగాలేక

ద్వారకఁ జేరు టేర్ధర్యవృత్తి

గీ. యేఁర నిజమాడ నిష్ఠుర మగుచునుండుఁ
గాక రోషంబు గలిగిన కఠినయవన
సేననిర్జించి యీయుగ్రసృష్టినిలుపు. వై 24

సీ. మాటి హుకా్క పకడో రె గిర్దేయని
యాహితాగ్నుల నెత్తి నణచకుండఁ
పాముధో నేకు తుం పాని లారే యని
తివిరి శ్రోత్రియుల మర్దించకుండ
ఘూసు లారే యరే గాడూ యనుచు శిష్ట
పరులపైఁ బడి చాల తరుమకుండ
కుర్దీ పకావురే జల్దీ యటంచు సా
ధువుల మెడల్బట్టి త్రోయకుండ

గీ. బహుల హేలామతీయుల పరుసయవన
రాజినిర్జించ నీవంటి ప్రభువు గలిగి
బ్రాహ్మణుల కిన్ని పాట్లు రారాదురమ్మ. వై 25

సీ. అగ్రజ పీడితుం డైన విభీషణు
నీవి ముకై దయఁజూచినావుకావె
అలమునిభీతుఁడౌ నంబరీషుని యార్త
వాదంబు మున్ను విన్నావుకావె
బహుబాధితుండైన ప్రహ్లాదునకుమున్ను
నీవు ప్రత్యక్షమైనావుకావె
ధ్రువముఖ్యులైన భక్తులనెల్ల సంతత

మీవుమున్ రక్షించినావుకావె

గీ. నాటిమతిలేద కరుణనున్నావకావ
రావు ప్రోవవదేమి పురాణపురుష
ధాత్రి ధాతవు మదిమది దప్పెనేమొ వై 26

సీ. గ్రామంబు లన్నియుం గాల్చి దీపారాధ
నలుజేసి రౌర యానందముగను
వడి సాధుజనుల సర్వస్వమ్ముం గొని శత
గోపంబు వెట్టిరి గురుతరముగం
బటు ఫలాదులువోయె బ్రతిమాలు వారి కే
మీయక గంటవాయించి రహహా
పెద్దలం గడు దొడ్డివెట్టి ప్రసాదము
ల్వడ్డించితగం బరవశులం జేసి

గీ. రవని యవనార్చకులె నీకు నాప్తులైరి
భూసురులు జేయు పూజలు పొసఁగవొక్కొ
యకట యిదియేమి పాపమునకు వెరువవు వై 27

సీ. వాసవుపిడుగుల వానకు వెరువవు
కడు ఫిరంగిగుండ్లకడల నేల
బెదర వెల్లప్పుడు భీష్మబాణాళికి
బాణాళికేటికి భయపడంగ
దవవహ్ని దిగమ్రింగితివిగాని జంకవు
భయమేల యీయరాబాకు నీకు
గణియింపవధిక రాక్షసుల శిక్షించుచు

మ్లేచ్ఛుల నణఁచుటే లెక్క నీకు

గీ. నీకడిమి నీ వెలుంగవుగాక లోక
కర్తవగు నీకసాధ్యమా కార్యమెద్ది
పామరులు నవ్వకుండంగఁ బలుకఁదలఁతు. వై 28

సీ. సమధికభ్రమచేత శబరియెంగిలిజేసి
యొసఁగినపండ్లెల్ల మెసఁగి మెసఁగి
చెలగికుచేలుండు జీర్ణచేలంబున
బొదవు ముక్కటుకులు బొక్కిబొక్కి
వనములోఁ బాంచాలివండిన శాకభాం
డములోని బలుసాకు నమలినమలి
పోంచియాదుగ్గనబోయనపోటిలో
కొఱ్ఱగింజలుకొన్ని కొతికికొతికి

గీ. పొందితప్పుడుభక్తుల పుణ్యమునను
భోగమోయప్ప యీతెప్పబోర్లఁబడిన
నేమిచేసెద వరులయుద్వృత్తినణచు. వై 29

సీ. తనుదానె కౌఁగిలించెను భ్రమరుక్మిణి
యలసత్యయును పాలయలుకమానె
తృణమైనఁబాయదు జాంబవతీదేవి
మేనుమేనదియించు మిత్రవింద
భద్రయుభవదూరు భద్రపీఠికయెక్కి
వదలకుండె సుదంత వామకరము
కాళిందినిజపాద కమలమొత్తుచునుండె

లక్షణమెయి దీగలాగ బెనఁగ

గీ. రావణోపమ పౌశ్చాత్య రాడ్బలంబు
సాధువులఁగొట్టి దోచగాఁ జకితులగుచు
కుదపనికివచ్చె నే నీకుఁదురకదొడ్డ. వై 80

సీ. తపనీయ కశిపుండు దండించుతఱువాతఁ
గాని ప్రహ్లాదుని గావలేదు
కురురాజు ద్రౌపది కొప్పుబట్టించి యీ
డ్చినవెన్కఁగాని రక్షించలేదు
కరిరాజు మొసలిచేఁ గడుఁగష్టపడినపి
మ్మటఁగాని వేంచేసి మనుపలేదు
పాండవుల్బాధలు పడినయనంతరం
బునఁగాని సిరులిచ్చి ప్రోవలేదు

గీ. భక్తులిటుకొన్ని యాపదల్బడయకుండఁ
గోర్కెఁపోషించ వట్లయోకొందఱికిని
మునుశిశువు నేడిపించక ముద్దురాదు. వై 81

సీ. జడవిప్పిజానపాలు సవరించియిరుసంక
బలుకిటికీదాటు పొగజుట్టి
బొట్టునెన్నొసలిపైఁ బొందుగాఁ దుడుపుచుఁ
బోగులువిడి చెవిపుడకలిడుము
సింగారమగు నిజారంగీదొడంగిబ
ల్లాను ధట్టికి జాఱవేయి
బీబినాంచారును బిలిపించివేగమే

తురవభ్యసించెము తురకబాస

గీ. శక్తి లేకున్న నిట్టి వేషంబుఁబూను
మన్ని సరిగాని లోకముఁ గన్న నీవు
నీచులకును సలాంచేత నేసహింప. వై 32

సీ. గోవర్ధననగంబు గొడుగుగాఁ బట్టిన
నాడు గేలున నొప్పి నాటెనొక్కొ
సరి దెబ్బలాడుచో జాంబవంతుని గుద్దు
కోరక్కులోఁ గట్లబారెనొక్కొ
నరుని సారథివైన నాడు భీష్మునిచేతి
కరకుటమ్మున రొమ్ము కమలెనొక్కొ
దుగ్గసబోయని తూపునాటినప్రక్క
గాయ మిప్పటికిఁ బోదాయెనొక్కొ

గీ. వెక్కసపు మ్లేచ్ఛభూజాని చిక్కఁజేయు
నుక్కణంచవేమి పోటకోపలేవ
పేదపుండెల్ల బయలను బెట్టవలసె. వై 33

సీ. కనుపించుకోవుగా ఖలులు మార్గములఁ
గొంకక ముక్కులు గోయునపుడు
ఆలకింపవుగదా యయ్యయ్యో ప్రజఘోష
ధూర్తులు వడినిల్లు దోచునాడు
జాలి లేదాయెఁగాఁ జటులతురుష్కులు
భామినులను జెఱఁబట్టునపుడు
అలుక రాదాయెఁగా యవనుల సత్రపభు

వసుమతి మట్టుకు వచ్చినపుడు

గీ. మంతతన మేమి మాతండ్రి మరచినావొ
మానునీ గొల్లపాల్ద్రావు మందబుద్ధి
దేవకీదేవిపాల్ద్రావఁ దెలివిరాదె. వై 34

సీ. అలవిప్రభార్యయౌ నదితిపాల్ద్రావుట
బలియాచనావృత్తి పాదుకొనియె
క్షత్రియకన్యయౌ కౌసల్య పాల్ద్రావ
రావణాదులఁ ద్రుంచి ప్రబలినావు
గొల్లయౌ నందుని కులసతి పాల్ద్రావఁ
పసులఁ గాచెడిబుద్ధి పట్టువడియె
నిసుమంత విసపు గక్కసి పాలు చవిఁజూడఁ
గాఁబోలు మాపట్లఁ గఠినవృత్తి

గీ. పాలకాగ్రణివైన గోపాలదేవ
పాలబుద్ధులుమాని మాపాలఁ గలిగి
పాలన మొనర్చు మయ్య కృపాలవాల. వై 35

సీ. వేగ యారే యరబ్బీపడ్లోరే యని
బోడిసన్యాసులఁ బొడుచువారు
మత్ రహో మూపరు మాటీ యనుచు వైష్ణ
వుల బొట్లు తుడువఁగాఁబోవువారు
పత్తరుకా యుస్కు ఫాద్దేవురే ఛోడు
దేవని శైవులఁ దిట్టువారు
కాలాటుకా తునీ క్యా తురే యంచు మా

ర్ధ్వలఁ బ్రల్లదములాడి ద్రోయువారు
గీ. వైరి యవనులు మిమ్ము నట్లుదిరఁ జేయ
నట్టివాంఛకు ద్విజు లెంతయాఁ దగ గుడి
మ్రింగువానికి లింగ మూర్చిండివడెము. వై 36

సీ. విసవహ్ని ప్రజనెల్ల వెతఁజేయఁ గాళియు
పడగలు పడఁద్రొక్కు పటిమయేది
వడిగ బిడౌజుండు పిడుగులు వర్షింప
శైల మెత్తిన నాటిశక్తి యేది
దుర్యోధవాదులు దొరికించుకొను వేళ
విశ్వరూపముఁజూపు వింతయేది
మురశకటాసుర నరకాద్యసురులను
మర్దించి చెలఁగు నీ మహిమయేది
గీ యిట్లుఖలు లెంచ జనుల నీ వెన్నటికిని
గరుణఁ జూచెదు యవనాది ఖలుల నణచ
వేమి లేకున్నఁ బ్రాణంబు లెట్లు నిలుచు వై 37
సీ. ఆభీరగృహముల నావగాచినపాలు
మీగడవడి దిగమ్రింగఁ గలవు
తల్లియిచ్చినచట్టి తగబ్రహ్మవచ్చిన
వెనుకఁ జూడఁగ వేగ విసరఁగలవు
రాధికామధురాధరామృతధారలు
గుటుకు గుటుక్కునఁ గ్రోలఁగలవు
భక్తులెల్లను దిరుపణార్ధములొసంగఁ
జెలఁగి లోలోన భక్షించఁ గలవు

గీ. కాని యవనులపైఁ బడఁ బూనలేవు
కబళమన నోరుఁ దెఱచఁగాఁ గళ్ళెమనఁగ
మోముఁ ద్రిప్పు హయగ్రీవమూర్తి వగుదె. వై 38

సీ. అలవిభీషణుపల్కు లాలకించినయప్పు
డతిదుష్టుఁడౌ రావణాసురుండు
వసుదేవముఖ్యుల వరబోధనినియెనే
దుండగీడైన కంసుండునాడు
విదురాదిబుద్ధి వివేకము ల్దెలిసెనే
క్రోధాత్ముఁడైన దుర్యోధనుండు
భీష్మాదులెంత జెప్పిన నిచ్చగించెనే
యాలగు శిశుపాల బాలకుండు

గీ. కొట్టక రణఘూర్తు లలరఁగా వట్టికాంతి
తాల్మియేటికి తురకలు తరిమిరాఁగ
నూరకున్నను మేమెలు లుందుమయ్య. వై 39

సీ. నిదురించినావో నిర్నిద్రధదాత్రికాగ
కాలిభోగేంద్ర భోగంబుమీద
శయనించినాడవో శైశవాకృతిపయః
పాథోధిపటువటపత్త్రసీమ
పవళించినావొ శ్రీలాలికా దోర్మూల
కూలకంప స్తనకుంభయుగళి
పడకచాలించెదో భక్తసామ్రాజ్యస
త్సంకల్పితానంద శయ్యయందు

గీ. నిబిడపాశ్చాత్యభీతులై నిఖిలజనులు

కదసి మొరబెట్ట నీకొట్టు నిదురబట్టె
లెమ్ము నాసామి జాగేలజిష్ణురిపుల. వై 40

సీ. నినుపూజగావింప ఘనవిప్రులేటికి
కొదువగాకుండ సద్యోదులెగలరు
వినుతించ శాస్త్రజ్ఞ విద్వాంసులేటికి
నీలుగావింప మొలాలెకలరు
అతికీర్తనలు సేయ యతివర్యులేటికి
కేకలు వేయఁ బకీర్లుగలరు
పూతాత్ములగు నసుష్టాతలునీకేల
తరుచుగాఁబీరు జాదార్లెగలరు

గీ. వట్టియాసలికివి మెడఁబట్టి తోసియు
జారుబట్టుకు వేశ్యాడినార మిట్లు
ముచ్చటకు నీవు పశ్చిమముఖుఁడవగుట వై 41.

సీ. జయవిజయాధవ జగదవనాసక్త
జయవిజయాధవ శౌర్యయుక్త
జయవిజయాధవ శాశ్వతకల్యాణ
జయవిజయాధవ జయధురీణ
జయవిజయాధవ సర్వాంకప్రజ్ఞ
జయవిజయాధవ స్వర్గనోజ్ఞ
జయవిజయాధవ సానుజనాధార
జయవిజయాధవ భయవిదూర

గీ. యనుచు జయవాక్యముల జనుల్వినుతిసేయఁ
జక్రహస్తుఁడ వైరిపు క్షయమొనర్చ

ధరణిబాలించు మా చంద్రతారకముగ వై 42.

సీ. చాటకబోజూమీ చాలబోవకయున్న
నాటివేపల్లెలో గోటిమాట
ప్రకటింతుజూమిమమ్ము రక్షింపకుండిన
తగగొల్లచెలుల వస్త్రములమాట
దాచనుజూమిమమ్ము దరిజేర్పకుండిన
కొంకకమధురలో కుబ్జమాట
బయలుబెట్టుదుజూమీ పాలించకుండిన
గాలయవనునినాటి కానిమాట

గీ. బయసు పోగొట్టుకోకు మాపాలగలిగి
సాధురక్షణ దుష్టశిక్షణమొనర్చు
మర్మమెఱిఁగినవానితో మానువాదు. వై 43

సీ. కలపదార్థములన్ని నిలయమండలినంటె
యాలవెన్నదినఁగ దొంగిలఁగలేదో
దుష్టులారాజదైత్యుల హరించితినంటె
యాలనరసారధి వగటలేదో
లక్ష్మియూరుక్షిణి లలనగూడితినంటె
యలరాధమరిగి నీవలరలేదో
అవనిపాలించగా నవతరించితినంటె
పసులపాలకుఁడవై పరగలేదో

గీ. అయ్య యదగార యీమాట లనకిమున్నె
ఖలులవధియించి నీసిగ్గు నిలుపుకొనుము
పరులునవ్వఁగ నపకీర్తి పాలుగాకు వై 44.

సీ. గ్రామదాహకకర్మ గతిమానుపుమటన్న
వెసనదేమరియు గావించెదీవు
పథికులఁదోపించు పనిమానుపుమటన్న
వెసనదేమరియు గావించెదీవు
చెరలుమారలుఁబుట్టు శనిమానుపుమటన్న
వెసనదేమరియు గావించెదీవు
బహుసత్యనాశ వాక్ఛటిమానుపుమటన్న
వెసనదేమరియు గావించెదీవు
గీ. వేడికొను కొద్దిలావాసె వెఱ్ఱివాఁడ
వాడముంచకుమనురీతి వచ్చెమాకు
బుద్ధితెచ్చుకు యవనుల పొంకమణచు. వై 45.
సీ. మామిడిచిగురు సొంపేమింకలక్ష్యంబు
కరచరణాబ్జంబు కాంతివెలుఁగ
కలకలనవ్వు చక్కనిముద్దునెమ్మోము
పద్మసౌభాగ్యంబు పరిమళింప
వెలిదమ్మిరేకుల వెలవెలబోఁజేయు
సోగకన్నులచూపు చోద్యపరుప
నిద్దంపునునుచెక్కు టద్దపులందుల
మొలకనవ్వులతాల్మి ముద్దుగుల్క
గీ. నపుడుపుట్టిన పసిబిడ్డఁడనగపాల
కడలిమఱ్ఱాకుపైబండి కరుణజగము
బ్రోతువటమమ్ము వేడ్కనిప్పుడిదియేమి. వై 46.
సీ. పుడమిపైననుగిడి నడువనేరనివారి

తీవ్రతపరుగు లెత్తించినావు
పైమీదదుప్పటి పడవైచువారిని
మించైనమూట మోయించినావు
గడపదాటని కులకాంతామణులనెల్ల
పృథివినెల్లెడల ద్రిప్పించినావు
షడ్రసోపేతాన్న సంభోజకృతజన
పరులనాకులపాలు పరచినావు

గీ. భళిరయఘటననీదు ప్రాభావమెల్ల
దీనజనులందుజూపెదు తెలిసివచ్చె
నయ్యసామెల్ల నిలునిండెనన్నమాట వై 47

సీ. భవదీయముఖభవ బ్రాహ్మణోత్తములకా
యవనులచేత నాయాసపడుట
భవదీయగురుబాహు భవరాజవరులకా
మ్లేచ్ఛనాథుల గెల్వలేకయుంట
భవదూరుసంభవ బహువైశ్యకోటికా
తురకలచేతను దోపుబడుట
భవదీయపాదసంభవశూద్రజనులకా
విమతులౌఖానుల వెట్టిసేత

గీ. మాకుచెప్పకుమెట్లైన మంచిదిగద
లోకకర్తవు నపకీర్తి నీకువచ్చు
వలదునాసామి యికనైనఖలులనణచు. వై 48

సీ రామమూర్తిబోలిన రావయ్యఖగయాన

రాకున్న మీద శరధునియాన
శీఘ్రంబె మమ్మురక్షించు శేషశయాన
జాగు సేసినను కౌశల్యయాన
మదికఠినతమాని మనుపుము నాయనా
మనుపకున్న వసిష్ఠ మౌనియాన
పాలించు నీమది పరమసత్కృపయాని
పాలించకున్న శ్రీభామయాన
గీ. అనబూనసమర్థుఁడ వఖిలజగము
నానదప్పక పోషించు మానితారి
తగవుతప్పి నటింపంగ ధర్మముగునె. వై 49
సీ. అరులగొట్టగ సింహ గిరిగుహ డాగిన
నరయనిన్నిరికి వాఁడందురయ్య
నీవు రక్షించక నీలాద్రి కేగిన
నవనిని స్మొండి వాఁడందురయ్య
తగనాదరించ కంతర్వేది కేగిన
నత్యుగ్రుఁడంచు నిన్నందురయ్య
దీనులఁబ్రోవక తిరుపతి కేగిన
వడ్డికాసులవాఁడ వందురయ్య
గీ. నాథయిటుల లోక నటనమొనర్చు నీకు
సహహానిందలు వచ్చిన నాటవిడిచి
యొడ్డుకొని బ్రోవుమయ్య యీయుర్విజనుల. వై 50
సీ. అరిసైన్యధూళి సూర్యాక్రాంతమైమించె
నీకనేమిదయజూచె దీవుమమ్ము

పరభేరిభాంకృతుల్ పగిలించెదిశలనిం
కేమి నామొర వినియెదవునీవు
ధరశత్రుహయఖుర దళితమయ్యెనిఁకేమి
వచ్చెదవయ్యబో గ్రీవంగమమ్ము
వైరితేజపుశిఖి వారకవచ్చెను
మొగముజూచెదవేళ్లు జగతిజనుల
గీ. నీపయికివచ్చినప్పుడు నీవెఱుంగ
వేదిహరిహరి యింక దిక్కేదిమాకు. వై 51
సీ ప్రజలెల్లవిసికిరి పాశ్చాత్యరాట్చమూ
భీతులైమిమ్మున బిలచిపిలచి
జనులువేసారిరి సమరతురుష్కుల
వేదనలనుమిమ్ము వేడివేడి
నరులెల్లస్రుక్కిరి నానాయవనహ్రూత
ముఖ్యార్థులైమీకు మొక్కిమొక్కి
ప్రాణిసంతతిభంగ పడిరిఖానులుసేయు
దరిలేనివెతమిమ్ము తలఁచితలచి
గీ. యిందుగలఁ డందులేడని సందియంబు
జెందవలదను వేదవాక్యంబులెల్ల
రెందు వెదకినఁ గానరాదేమియిపుడు వై 52
సీ. బహుపణాదీప్తుడౌఁ ఫణిరాజుపైఁబండి
గావగాదయయెద గాచెదీవు
వరగరుద్విస్ఫుర ద్గరుడునిపైఁజెంది
చిరసుఖగతుల రక్షించెదీవు

వేతాద్రిధిగత జగద్వితతివిష్వక్సేను
దరిజేర్పు బలయుక్తి దనిపెదీవు
ఘనభుజాబలవంతు హనుమంతునెదజేరి
యెలమిబ్రహ్మానంద మిచ్చెదీవు
గీ. పొసగనీరీతి దలపోయ పొడుగువాని
తీవ్రపన్యాయ మెరయగా దీనపాల
పృథుబిరుదులీల యేమూలబెట్టినావు వై 53
సీ. మామొఖాసాకు గ్రామంబిమ్మనగలేదు
కొంపలుగాల్పించ గూడదంటి
కరిహయాదులమేము కాంక్షింపగాలేదు
గోవధమాన్పించి బ్రోవుమంటి
మాకమిమ్ములను సామ్రాజ్యమిమ్మనలేదు
జనులనుదోపింప జనదటంటి
స్వామిమాకిది మమ్ముజరిగించమనలేదు
క్షితిలోనప్రజల రక్షింపుమంటి
గీ. చెలగిమీపదసేవయు జెందుమాకు
వేరొకనివేడనేటికి వెన్నగలుగ
నహహ నేతికినేటికి యంగలార్వ. వై 54
సీ. భక్తసంరక్ష కృపాపరజలజాక్ష
నరహరిగోవింద హరిముకుంద
సంసారతారక సజ్జనాధారక
సత్యసంకల్ప శేషప్రతల్ప
నీలాంబుదశ్యామ నిఖిలదేవలలామ

సర్వపాపవినాశ జగదధీశ
శ్రీరమానాయకా శ్రితఫలదాయక
శృంగారదరహాస చిద్విలాస
గీ. భవదచలపాదగతులైరి యవనులనిక
మందగతిగాగ తరువువారందశిఖియు
అందఁబండిన కాల్బట్టుచందమయ్యె. వై 55
సీ. దశకంఠమర్దన దక్షశిక్షాటోప
రామనామకమౌ ఫిరంగి దెబ్బ
ఖలహిరణ్యాక్ష శిక్షకనృహర్యక్షక
రమ్యనామ ఫిరంగి దెబ్బ
కుంభినీభరణ విజృంభణశ్రీకూర్మ
రాణ్ణామకంబౌ ఫిరంగి దెబ్బ
శకటవత్సాసుర సంహారగోపాల
రత్ననామకమౌ ఫిరంగి దెబ్బ
గీ. తప్పితగిలియుచావక ధరణికలిగ
యవనబలము సుదర్శన జవమహోగ్ర
మహహార్యైనట్లుగాకుండ రహిజనించె. వై 56
సీ. గ్రామముల్ నిర్ధూమ ధామములాయెను
సస్యంబులెల్ల నాశనముఁజెందె
దొడ్లలోశాకము ల్లుంపశుద్ధిగబోయె
దోచిరిసర్వంబు గోచిదక్క
చెట్టొకపిట్టయై చెదరిరిదిక్కులఁ
బలువెతపడరాని పాట్లుపడిరి

అన్న మందరికిని నమ్రతోపమంబయ్యె
వన్నె గాయిటుమీద వానలేదు
గీ. ప్రజలపనిదీర నిక మొదల్బదిలమయ్యె
దరిదరికిఁ జేరెముందురా తురకదండు
చిత్తమునఁ జూచుకోవయ్య శీఘ్రబుద్ధి. వై 57
సీ. శ్రీదేవిమదితను జేరరానీదని
భూదేవివదలక పాదివేసనఁగ
మోక్షధనంబని మునులుమహాపేక్ష
జెలగినిక్షేపంబు జేసిరనఁగ
భక్తాగ్రగణ్యుఁడౌ బలిపూజసేయంగ
బలిసద్మమునునుంచి వెలసితనఁగ
బ్రహ్మమిదిహృదయ సంభావనతోడఁడా
గుడుమూత లాడంగఁగోరెననఁగ
గీ. ధరణిగుములయినట్టి పాదములతోడఁ
బారిపోలేక యిఁక నేది బ్రదుకుతోఁచ
పౌరుషముచాలు తురకలబలముద్రుంపు. వై 58
సీ. నిఖిలవిశ్వంబును నీయందుఁదగియుండు
విశ్వంబులోనీవు వెలసినావు
విశ్వరూపకుఁడవు విశ్వంభరుండవు
విశ్వసాక్షియిపుడు విభుఁడవీవు
విశ్వసర్గస్థితి విదళనకరుఁడవు
విశ్వంబునకునీకు వేరులేదు
కినుకవిశ్వద్రోహి మొనరించుదుష్టుల

శిక్షించి ప్రబలరక్షింపవేమి

గీ. యింతదుర్గతిమాకేల యెట్టులయిన
గానిసుభమౌను కందకులేనిదురద
బచ్చలికినేలగల్గునో పరమపురుష. వై 59

సీ. ఉరమునసిరిదేవి యొరపైనమెరుపుగా
గంభీరవాక్యంబు గర్జిగాఁగ
హారమౌక్తికకళ లలవడగళ్ళుగా
భ్రూవిలతహరిచాప లీలమెరయఁ
గోరికభక్త మయూరముల్నటియింప
దీనచాతకతతి తృప్తిబొంద
దనువునురుప్రభా దశదిశల్వేడంగ
పృధివీస్థలినికృపా వృష్టిముంచి

గీ. శాత్రవగ్రీష్మభీష్మ తేజంబణంచు
సత్ప్రజాసస్యసంరక్ష సలుపుమిదియె
సమయమోయయ్య యికచాలుజాగుసేయ. వై 60

సీ. నిడుఁదకడానిడా ల్నడుమునబిగియించి
తీరైనగండ పెండారమూని
రమణీయమణి శిరస్త్రాణమౌదలదాల్చి
స్ఫుటవజ్రమయమైన జోడుఁదొడిగి
తూణంబులిరువంక తోరంబుగాఁగట్టి
విలసితకరమున విల్లుబట్టి
పరవైరిహరధార తరవారిధరియించి
డాపలిచికిలి కఠారిచెక్కి

గీ. రామవేషంబుతో సుమిత్రాసుతుండు
నీవురణరంగముననిల్చి నిబిడశస్త్ర
జాలములు నేలపాల్సేయ లీలమెరయ. వై 61

సీ. గాధేయయజ్ఞ విఘ్నకరాసురావళిఁ
జక్కఁజేసినయట్టి శౌర్యనిధివి
పటుధైర్యవంతుఁడౌ పరశురామునిపరా
క్రమము క్రిందుగఁజేయు ఘనభుజాఁడవు
పదునాల్గువేల దుర్మార్గ రాక్షసులతో
ఖలుని మర్దించిన ఘనబలుఁడవు
బంతులాడినరీతి పఙ్క్తికంఠునితలల్
ఖండించుచండ ప్రచండరుచివి

గీ. నీవు నొకదొడ్డకార్యమా నీచయవన
సేన నిర్జించు పనిప్రజ ల్చేసికొన్న
కర్మమున నీదు చిత్తంబు కరుగదేమొ. వై 62

సీ. కోటిసూర్యోజ్జ్వల కోటీర కళలతో
రమణీయ మణికుండలములతోడ
శంఖచక్రగదాసి శార్ఙ్గయూధముతోడ
ప్రస్ఫురత్ప్రభ కౌస్తుభంబుతోడ
వలిపె బంగరువల్వ వలిపెంపు నీటుతో
పొక్కిలి తామర పువ్వుతోడ
గంగనుగన్న చక్కనిపదాంబుజముతో
మిసిమిచామనచాయ మేనితోడ

గీ. పక్కిజక్కి చవాలున నెక్కినాదు

మెఱిక్కు గైకొని శౌర్యంబు పిక్కటిల్ల
వెక్కసముగ యవనసేన చిక్కు సేయు వై 63

సీ. దండంబునీకు నుద్దండ తేజఃపుంజ
జోహారుభక్త దుర్మోహనాశ
మ్రొక్కుదగాజల ముక్కాయకాంతక
వందనంబిదె సదా నందకుండ
నుతిజేతు శతధృతి స్తుతియుత సత్చర్య
ప్రణుతి జేసెదముని ప్రతతిచరిత
సాష్టాంగమిదెనీకు సాష్టాపరాంబర
కేలుమోడ్చెద జగ త్కేళిలోల

గీ. వలదు నీకుపరాకు భావంబులోన
దీనజనములఁ గృపఁబ్రోవ దిక్కు నీవు
దుష్టుల వధించి పోషించు శిష్టజనుల. వై 64

సీ. గరుడాచలంబునఁ గరుణతో వసియించి
సత్యభామా తటి త్సాన్ద్రమనలరి
పరచాపమనియెడు హరిచాప మమరించి
వివిధ భక్తుల కృపా వృష్టిముంచి
అసురమయూర వారము మోదమందించి
దీనచాతకములఁ దృప్తినించి
క్షత్రియ కన్యకా సస్యము ల్పండించి
జగములు చల్లఁగ నెగడఁజేసి

గీ. నవ ఘనస్ఫూర్తిగో డనన్నరకబహుల
ఖరదవానల మణఁచిన కణకయిపుడు

రిపులశిక్షించి పాలించు పృథివినెల్ల. వై 65

సీ. నీపాదరజమున నిముషంబులోపల
బాపురే సతియయ్యె బాపరాయి
నీబాహుబలమున నేలమెకుప్కన
ముక్కంటిచాపంబు ముక్కలయ్యె
నీయాజ్ఞచే గిరుల్నీటితెంపునదేలె
కణక సముద్రంబు కట్టువడియె
నీప్రతాపాగ్నిలో నిఖిల రాక్షసకోటి
మాడి దోమలభంగి మడిసినారు

గీ. బాగులే యిట్టి నెరవైన ప్రభువుగలిగి
అప్పులకు లొంగితిరుగ లే మయ్యమేము
కర్మమా మాకు గజమెక్కి గంతదూర. వై 66

సీ. మున్ను తాటకి ప్రాణముల్గొన్న బాణంబు
మీరి సుబాహుండు న్మిన విశిఖము
మించివిరాధు ఖండించిన ప్రదరంబు
ఖరదూషణాది సంహారశరంబు
మాయమారీచుని మదమణచిన తూపు
ఘోర కబంధువు గూల్చు ములికి
వాలి మహాశాలి గూల నేసినకోల
జలధి నింకించిన సాయకంబు

గీ. రావణాది మహాసుర రాజివణచు
చండ కాండంబులే మాయె చటులయవన
ఖండనముసేయ నయ్యంబకములె బంపు. వై 67

సీ. ఖల హిరణ్యాక్షు ముఖ్యులనెల్ల ఖండించి
దేవతా తతిఁబ్రోచు దివ్యమహిమ
రావణకుంభకర్ణాది ముఖ్యుల నెల్లఁ
గొట్టి మానులఁబోృచు దిట్టతనము
శిశుపాలకాది దుశ్శీలుర బరిమార్చి
క్షితిదీనజనుల రక్షించుకణక
కంసాదిదుష్ట విధ్వంసనం బొనరించి
ధరణిపాలించు నుద్దామకలన
గీ. వినుటయేగాని కన్నుల గనుటలేదు
కంటిమిప్పుడు యవనుల గర్వమణచి
ప్రజలరక్షించు నీదు ప్రభావమెన్న వై 68

సీ. జయమయ్యె యవన రాట్సంతమ సముబోయె
భవదీయ భాస్వత్ప్రభా బలమున
భువనజాతంబులు పాలుపుచేఁ జెన్నొందె
దిక్చ్రక్రములుచాల తెలివినొందెఁ
గమలజాదులనుతుల్ గణనసేయని నీవు
లీలనామనవి చెల్లించినావు
బ్రహ్మాండభాండ సంభరణలీలాగన
నిలనిన్ను మెచ్చి యేమీయగలను
గీ. తోఁచదిఁక నెట్లు లిదెనాకుఁ దోఁచినట్లు
తులసి దళ మొక్కటిత్తు సంతోష మొందు
మదియె యగణిత పూజగా నవధరింపు. వై 69

సీ. అపరాధి నపరాధి నార్తరక్షణదక్ష

యపరాధి నపరాధి నంబుజాక్ష
యపరాధి నపరాధి నద్భుతగుణధుర్య
యపరాధి నపరాధి నధికశౌర్య
యపరాధి నపరాధి నంబుధిగంభీర
యపరాధి నపరాధి నత్యుదార
యపరాధి నపరాధి నానందపరిపూర్ణ
యపరాధి నపరాధి నఖిలవర్ణ

గీ. నేర్చియైనను మిక్కిలి నేరకయిన
నిష్ఠురోక్తులు బల్కితి నిన్ను నాదు
తప్పుసైరించి సుతునిఁగా దయఁదలంచు. వై 70

సీ. వీరాధివీరత వెలయుచుండెడి నిన్ను
బిరికివాఁడంటిని భీతిలేక
జగదేక వితరణాశ్రయమూర్తివగు నిన్ను
బహు లోభివనుచును బలికినాఁడ
బరిపూర్ణ కరుణా స్వభావుఁడవగు నిన్ను
నిర్దయుండవని నిందించినాడ
అద్భుతానంద కళ్యాణుఁడవగు నిన్ను
గూర్చి పలికితి నిర్గుణుఁడవనియు

గీ. నలుక జనియించి దుష్టుల ననుచుకొంటిఁ
బడుచుదనమున నిట్టింటి భక్తవరద
మరువరాదు సమక్షము ల్మదిదలంచు. వై 71

సీ. పరమ మోహాంధుండ పాపస్వభావుఁడ
దుశ్శీలపరుఁడను దుర్మదుండ

దుష్కార్యయుక్తుఁడ దుర్మార్గసక్తుఁడ
క్రోధాంతరంగుఁడ కుటిలమతిని
లోభిని నింద్రియాలోలుఁడ చపలుఁడ
దంభారతుండ మాత్సర్యయుతుఁడ
దుష్టుఁడ దుస్సంగ తుష్టుఁడ శమద మ
హీనుండ శౌర్య సంతానవరుఁడ
గీ. నయ్య శరణొందితిని నన్ను నాదరించు
సజ్జనునికైన మిగుల దుర్జనునికైన
సౌఖ్యమొసఁగదె కల్పవృక్షంబు నీడ. వై 72
సీ. తేనమోరక్షిత దేవతాయసురేంద్ర
సేవితాయ మునీంద్ర భావితాయ
తేనమో నిత్య సుధీరతాయ సుమేరు
ధీరతాయ సుఖాని వాలితాయ
తేనమోనిర్జిత దానవాయవృతాప్త
మానవాయపయోబ్ధి భానవాయ
తేనమోజ్ఞాన సుధీకృత యస్తాయ
సుకృతాయ విబుధాదరీకృతాయ
గీ. పాహిమాంపాహి మామన్య దాహినాస్తి
శరణు శరణాబ్జసుందర శరణయనుచు
వందనముజేసి కొలుతు భావముననిన్ను. వై 73
సీ. స్నాన సంధ్యాద్యనుష్టాన సక్తుఁడగాను
పరమ యోగాభ్యాస పరుఁడగాను
విమల దివ్యజ్ఞాన గమనదక్షుఁడగాను

ఘనతర దాన సంగతుఁడగాను
భవదీయ పదపద్మ భక్తియుక్తుఁడగాను
నిరుపమజ్ఞాన మానితుఁడగాను
పరమోపకార సంభరిత చిత్తుఁడగాను
శమదమసత్య నిశ్చలుఁడగాను
గీ. వినుము భవదవనముగోరు జనుఁడనయ్య
నేను మిక్కిలి తెలుపఁగా నేరనయ్య
దేవ నిర్హేతుకర కృపం బ్రోవవయ్య వై 74
సీ. ధరణి గుప్తంబైన చరణయుగ్మముతోడ
వలరారు పక్క గాయంబుతోడ
రమణీయమైన వరా హాననముతోడ
ఘనతర ఫాలలోచనముతోడ
నిగనిగలాడుబల్ నిడుద కీల్జడతోడ
నవ్యగోక్షీర వర్ణంబుతోడ
మయినిండనలదిన మంచిగంధముతోడ
నమిత భక్తానుగ్రహంబుతోడ
గీ. నఖిల లోకావనము సేయ నవతిరించి
యున్న మిమ్ముల నుతిసేయ నోపదరమె
నరహరిగిరీశ నుతిసేయ ధరమెమాకు. వై 75
సీ. చెలువుగాపన్నీరు జలకంబు లొనరించి
విలువలేనిక డాని వలువగట్టి
కలికిమానికములు గలుకుగద్దియనిడి
తిలకంబు నొసటిసై నలరదిద్ది

కలపంబు మెయినిండ నలది బల్లగరాలు
తళతళలాడు సొమ్ములుఘటించి
అలరు నెత్తావిదండలు వీలుగాఁజేసి
కలికిరా సున్నమింపొలయఁబెట్టి
గీ. విడెమొసఁగి పదములొత్తెద వేడ్కతోడ
పవ్వళించుము మన్ననఃపద్మశయ్య
యలరిపులనెల్ల మర్దించి యలసినావు. వై 76

సీ. భువనములొక్కటికిలో బూనిరక్షించితా
భువనంబులో నిక్కముగ జరింతు
పరిమాణరూప విభ్రాజమానుఁడవయ్యు
తా బేటిరూపంబు దాల్చి నేర్తు
వసమవైరాగ్య మానసుఁడవయ్యు వినోద
గతితో నముదము రాగముధరింతు
వతినిర్భరాత్ముఁడవై యరింగి యనంత
భారనిర్వాహక ప్రభవహింతు
గీ. వహహ లోకోపకారార్థ మవతరించి
యొంచి తత్క్రియలొనరించి మించజెలఁగు
కూర్మనాయక నన్నేలుకొనగదయ్య. వై 77

సీ. అతి తిగ్మరుచి మండలాత్మయుగ్మచ్ఛాయ
వలయాద్రి దాపలి వెలి వెలుఁగగ
రింఖాంచిత ప్రభాశ్రేణి కాగిసదీప్తి
కనకన త్క్రనకాద్రి కాంచితముగ
గురుదిశాచ్ఛేది కాఘుర్ఘురధ్వనిమహా

స్తనయిత్నుగర్జను చదువుఁజెప్ప
పదఘట్టనలజిహ్మ ప్రళయోదకమ్మున
దనరంగ నామ్రేడితముగ జేయు
గీ. కిటితనువుతో హిరణ్యాక్షు గీటణంచి
క్షమధరించితి చర్వణ సమయలగ్న
మేఘశతకంబు దంష్ట్రలమీఁద కరిగి. వై 78

సీ. నతిజేతునీకిదె నాశికానిర్గత
జంఝానిలోద్ధూత శైలజాత
వందనంబిదెనీకు ప్రహ్లాదశుకపరా
శరధీర సుహృదయ సద్విహార
సాష్టాంగమిదెనీకు జలజాప్తశతభాను
జిత్వరతాపాగ్ని నృసింహరూప
మ్రొక్కెదనిదెనీకు నక్రూరదృక్త్విష్ణ
సారపూరకోదారకరుణ
గీ. పాలనమొనర్చు నిఖిలశబ్దాల దళిత
కనక కశిపసురారి దుష్కాయసతత
జాతకీలాలపరితృప్త భూతనివహ. వై 79

సీ. దేవతాతతికోర్కె దీర్పగా సమకట్టి
జనహితార్థికి కశ్యపునకుఁ బుట్టి
పోలుపుగా నుదుట మహోర్ధ్వపుండ్రము బెట్టి
కింశుకదండంబు కేలఁబట్టి
పసపునిగ్గులుదేరు పచ్చనిగోచియు
మధ్యస్థలంబున మౌంజిఁజుట్టి

వర్ణనీయధ్వజ వర్ణిపై బాడగట్టి
బాలార్క శతశత బాగుబట్టి
గీ. ధరణిగగనంబు రెండు పాదములుబెట్టి
మరి తృతీయాంఘ్రినబ్బలి మట్టినట్టి
వామనావేశ్రమ నానుచర్మమనుండు. వై 80

సీ. కార్తవీర్యార్జున కరచరణాధ్యాళి
దారుణోగ్ర కుఠార ధారదునిమి
మోహనాగ్ర క్షేత్రములు నంగాగాజేసి
భీమేశహాలములు బెగలదున్ని
తన్నప్రపమస్తక తతులుగట్టులువైచి
కడు విచిత్రంబుగా గట్లుగట్టి
తపసునికీలల ధారాళి నెల్లను
జయమనుచాలున జగతినించు
గీ. ఘనయశంబునరోదసీ ఘటమునిండ
ప్రబలజేసితిపొథిశా పాడుకొనిరొ
యహహ నీమూర్తి పరశురామావతార వై 81

సీ. మనువంశభూషణ మహిమచేజెన్నొంది
ఘనకశాసాంగత్య కలనజెంది
సకలనాయకవర్ణ సంపొంది నింపొంది
సద్గుణాళితి ప్రశస్తినొంది
అత్రిసపటుల లీలాత్తత జెలువొంది
నిర్దోషగతులచే నెరపుకొంది
సకలజగన్నుత సంపద వెలుగొంద

సుకుమారరత్న సంసిద్ధినొంది

గీ. సరస దశరథపత్ని కౌసల్యగర్భ
మనెడు గనినుండు హరినీలమనజనించి
రామ సంజ్ఞ జెలంగుని స్ఫురిస్తుతింతు నై 82

సీ. ఫణిరాజశయ్యపై పవ్వళించెడునీవు
మహీ తప్పటడుగుల మసలినావు
బ్రహ్మాండగోళము ల్పాకియాడెడు నీవు
రహిబ్రాకితివి దశరథునియింట
బహువేదజాల వాక్సహితుఁడ వగునీవు
అవ్యక్తవాక్యము లాడినావు
సకలచరాచర సంచారివగునీవు
మహినిండగదలక మసలినావు

గీ. తండ్రిభాగ్యమననొ తల్లితపమువలను
పురజనులు తొల్లి జేసిన పుణ్యమునను
భూతలంబునఁ బ్రతియింటఁ బుట్టితీవు నై 83

సీ. చిరుతకూకటికట్టు సిగరావిరేక ము
త్యములు నెన్నొసటిపై దుముకుచుండ
నిద్దంపుచెవుల జెందినపెద్ద మగరాతి
మద్దికాయలజత ముద్దుగులుక
పులిగోరుతూటిన బలు పద్మరాగంపు
హారపుమణి తళుక్కనుచు మెరయ
కంకణధ్వని మొలగంటల రొదవొద
కింకిణీరవము నేకీభవించి

గీ. భరతలక్ష్మణశత్రుఘ్న బాలకేలి
నన్న నినుగన్నతలిదండ్రు లనఘులెన్న
చిన్న రామన్న నన్ను రక్షించుమన్న. వై 84

సీ. రత్నకీలితతనుత్రాణంబు ధరియించి
కస్తూరికా తిలకంబుదిద్ది
బాణాసనసబాణ తూణీరములుఁ దాల్చి
అద్దంబుజాజిరా గంధమలరి
మొసలివాసెరబాకు మొలజక్కఁగా జెక్కి
కటిసెర బంగారు కాశిగట్టి
భీకరంబుగ గండపెండేరములు బూని
నవరత్నమయ భూషణములు దొడగి

గీ. వీర శృంగారరసములు వెలయదాల్చి
కౌశికునితోడ జనితాటకావధంబు
సలిపి జానకి పెండ్లాడఁ దలఁచితావు వై 85

సీ. చికురభావముదోచె జెన్నలరారునీ
పదపద్మకలిత షట్పదములనఁగ
యదుగిడునప్పుడె యానసంబేర్పడె
తారకాగతి నిశా ధవుఁడనంగ
అంజవేయ కుచద్వయము పురానుత్తమ
మని యుక్తశోక దంపతులవలెరె
కలయ గ్రిష్మనువేళ కాంతయయ్యెతనూజ
నొసఁగ నల్లనిజూచి మర్వియనఁగ

గీ. అంత గౌతమసతియైన నహల్యమీరు

వలిధి సత్కారములుసల్పి నట్టియంఘ్రి
రజమునుతిసేయదరమె శ్రీరామచంద్ర. వై 86

సీ. జనకరాజన్యస త్సభలోననుండి గొ
బ్బునలేచి జనులు నబ్బురముసొంద
జాలుబిగించి ల సత్కంకణములు ప్ర
కోర్ధ్వసీమల గొనబుతగనిడిన
సామిలంబక కంఠసరము చక్కనమర్చి
చటులతరాంబక చాపమెత్తి
హస్తాగ్రమునబిస మవలీలగొనినట్లు
గొని వారిదివియ వెక్కునవిరిగె
గీ. విరిగె రాఘవ తధ్వని తరులు గిరులు
విరిగె నృపతుల మనములు విరిగెరిపుల
నడుములెల్లను నీ భుజోన్నత్వగరిమ. వై 87

సీ. కనకశలాక శృంగారతరంగంబు
రాజమరాళి సాంబాజ్యలక్ష్మి
మదనబాణము వనమాలిక మాణిక్య
వల్లరిచంచలా వల్లచంద్ర
కళధగద్ధగిత నక్రంబున నవరత్న
మంజరి కందర్ప మదగజంబు
లావణ్యసరస విలాసపేటిక మనో
జనవధారక ఘనసారఘుటిక
గీ. జాతరూపాభ శతగుణ పాత్రజనక
జాతద్విజాత నవ వనజాతసీత

పరిణయంబగు నీమూర్తి ప్రస్తుతింతు. వై 88

సీ. కల్యాణవేదికా కౌతుకంబులు దాల్చి
యొండొండు మైనంట నుండు ప్రేమ
తెరవైచి బాసవాల్ తెరవలుదీపింప
లోలోన జూచి మేల్జూపుజూపు
తోరంపుముత్యాలు దోసిటగీలించి
తలబ్రాలు బోయు చిత్తరపుకోపు
మంగళసూత్ర సంబంధవేళానోన్య
పులకిత చ్ఛిన్నహస్తములమెరంగు
చిత్రపట్టములతో సీతయునీవును
గురువందనము సూత్రకోనరు భక్తి
గీ. రంగుమీరంగ మిధిలాపురంబునందు
జూచు పుణ్యాత్ములేనోము నోచినారొ
భద్రయుతకీర్తి శ్రీరామభద్రమూర్తి. వై 89

సీ. తమ్ములు నీవు నందమ్ముతోడుత పెళ్లి
కొడుకువై సతులతో గూడి నడువ
పరశురాముని భంగపరచి యయోధ్యాపు
రంబు వైభవము మీరంగజేరి
కోరిక దీరగా కొన్నాళ్ళు వసియించి
దశరధ తనయులై ధన్యనియతి
యువరాజ్య పట్టాభిషేకోద్యోగంబు గావించ
గనుగొనఁజాలక కైకమిమ్ము
గీ సకలలోకైక నిందకు జడియకకట

అడవులకు నేగుమనఁగ నోరాడనెట్లు
కైకననసేల నీదు సంకల్పమట్లు. వై 90

సీ. అంటినఁగందిన నడుఁగు దమ్ములతోడ
నడవి జానకియెట్లు నడచెనయ్య
పుడమియేలుటమాని జడలల్లుటకుమిమ్ము
తల్లిగన్గొనియెట్లు తాళెనయ్య
అనుగుదమ్ముడు సుమిత్రాత్మజుండతిభక్తి
మిముగొల్చి వెతమాని మెలఁగెనయ్య
నీపాదు కలరాజ్య నేతలుగా గొల్చి
భరతుడెక్కడయెంత భక్తుడయ్యొ

గీ. చిత్రకూటాద్రి కడుతప్పు సేసినట్టి
చెడుగుకాకిని మరల రక్షించినావు
రామ నీవెంత కరుణాంబు రాశివయ్య. వై 91

సీ. పాపరాధువిరాధు నేపునబరిమార్చి
ఖరకృత్యు ఖరదైత్యు గండణంచి
అతినీచుమారీచు నంతకపురిఁజేర్చి
దుర్మదాంధులనెల్ల దునిమివైచి
దండకావర్తుల దైత్యులబరిమార్చి
దుర్మదాంధు కబంధు దునిమివైచి
తతవక్రశీలముల్ తాళముల్ఖండించి
వాలి మహాశాలి గూలనేసి

గీ. కడిమిసుగ్రీవ హనుమదాంగదులఁగూడి
వనధి గర్వమణంచి రావణునిద్రుంచి

ఘనవిజయ మొందు వీరరాఘవుఁడ వీవు. వై 92

సీ. శాశ్వతంబుగ విభీషణునకు లంక ని
చ్చల నొసగుటమది దలఁచుకున్న
చెరబడ్డ సురసిద్ధ గరుడగంధర్వ కాం
తల విడిపించుట దలచుకున్న
నిఖిలలోకంబును నిష్కంటకంబుగా
నలరఁబ్రోచినవింత దలచుకొన్న
కొలిచినవారికి కొంగుబంగారమై
దగు కోర్కెనిచ్చుట తలచుకొన్న

గీ. ముదముగా నీ ధరాసుత ముద్దరాలి
పరమపావని వినరాని పల్కులాడి
యగ్ని జొరజేయుటకు మీకు నలుకబుట్టె. వై 93

సీ. అభినవాయోధ్యా పురాంతఃపురమునందు
మిసిమి బంగరురంగు మేడలోన
జిల్గుమేల్రతనాల సింహాసనముమీద
వామాంకమునసీత పేర్మిమగులుక
ఆజ్ఞాప్రవర్తుడై యతిభక్తితోడను
ఛత్రంబు వెనుక లక్ష్మణుఁడుబట్ట
భరతశత్రుఘ్నులు పార్శ్వస్థులైయుండ
హనుమదాదులుదంతి నత్తినిలువ

గీ. మిసిమి నగరిజనాళి పెంపెసగమధ్య
నీలజలరుహ రుచిమీరు నిన్ను రాము
రమ్యగుణధాముపట్టాభి రాముగొల్తు. వై 94

సీ. నీలాంబుదాప్తి మానితమూర్తి చెలువొందె
కామపాలాభిఖ్య గరిమ జెంది
పంకజాతంబుల బరిమార్చి కళమించి
యరిభయంకరగతి నధిగమించి
శుభకరధవళాంగ శోభ చేదనరారి
రేవతీరమణాత్త దీక్ష నింగి
సదమలభద్ర ప్రశస్తచే నుప్పొంగి
ఘనతరారామాఖ్యగతి జెలంగి
గీ. చంద్రుడడనభూమి వాహ్లాద సరణివీరు
నిన్ను గొనియాడదరమె వాఙ్నిధికినైన
అటులసంకర్షణ స్వరూపాభిరామ. వై 95
సీ. నీ మహిమంబు వర్ణింపగాదరమానె
ఫణిపతికైన వాక్పతికినైన
సకలలోకంబులు సంతోషమొందింప
రక్షింపశిక్షింప రాజవీవు
అఖిల జగత్కంటకా కృతినుగ్రిలా
త్రిపురరాక్షసులు మర్దించుకొలను
తద్వధూనికర వ్రతంబులు భంగించి
దుష్టరాక్షసులను దునిమిధరణి
గీ. గావ బుద్ధమూర్తివైన లోకప్రశస్త
అతులకారుణ్యమూర్తి ని న్నభినుతింతు
నీపదంబుల పైభక్తి నిలువజేయు. వై 96
సీ. దేవకీసతి వసుదేవనందనుడవై

నందయశోద లానందమంద
సమదాత్తపూతన శకటతృణావర్త
బకధేనుకుల మెల్ల బలిమిదునిమిచి
గొల్లచేడియల మేల్కోకి లెల్ల హరించి
మామ కంసునిజంపి మథురనగరిణి
రుక్మిణీ ముఖ్యనారుల బంధులనుగూడి
ద్వారక వచియించి ధర్మరీతి
గీ. పాండవులబోచి కౌరవ బలమునణచి
భక్తరక్షణ దీక్షచే బ్రబలినట్టి
కృష్ణ మాధవ గోవింద కేశవహరి. వై 97
సీ. అయ్యారె కన్గొనలబ్బురమౌ భళి
నిక్కువీనులతోటి నిద్దమహహ
రమ్యతరాంఘ్రి ధారాగతి వహవరె
వలనొప్పుసుందర వాలలీల
ఆహాసమస్త శుభావార్తవిస్ఫూర్తి
బాపురేవిపులమౌ వీపుకొప్పు
మఝ్ఝూరె బాహు సంపదసోయగం బద్ది
రయ్య శౌర్యస్ఫూర్తి యరిదిగొనుము
గీ. డెందమునను జనుల్చోద్యమంది పొగడ
ఘనతరాశ్వంబు పైనెక్కి కలికిమూర్తి
వగుచు బాహ్యాత్యవీరుల నణచగలవు. వై 98
సీ. మాణిక్యపీఠికా మధ్యసద్ధసితు
రవికోటిశోభా విరాజమాన

కందర్పశతకోటి సుందరాకారుని
　　శంఖచక్రగదాసి శార్ఙ్గధరుని
శ్రీభూమియువతి సంశోభిపార్శ్వ ద్వయుల
　　నంచిత పుండరీకాయతాక్షు
శ్రీవత్సకౌస్తుభ చిహ్నితతతవక్షు
　　కటిలసన్మణియుత కనకచేలు
గీ. మకరకుండలకేయూర మహితకంక
ణాంగుళీయక ముఖ్య భూషాంగు శ్వ
నిలయ నారాయణస్వామి నిన్నుగొలుతు. వై 99
సీ. పారషట్చాస్త్రాది ధీరధీసంపత్కు
　　లార్య సద్వేంకటాచార్య శిష్య
సురుచిరాపస్తంబ సూత్రమౌద్గల్య స
　　గోత్ర గోకులపాటి కులజగౌర
మాంబికాసద్గర్భ వామాత్యవరపుత్రి
　　కూర్మయాఖ్యకుండు కుతుకమెసఁగ
నీకుయర్చనంబు నిత్యంబొనర్చుచు
　　మృదుపదశతకంబు సదమలముగఁ
గీ జేసె నీకంకితమొనర్చె దాసుఁడగుచు
వాయురారోగ్య మైశ్వర్య మరిజయంబుఁ
గరుణదయచేసి రక్షించు కమలనాభ
వైరిహరరంహ సింహాద్రి నారసింహ 100

శ్రీసింహాద్రినారసింహాశతకము.

సంపూర్ణము

